## (ప్రకరి) సప్తమరంగము.

విభాకరశాస్త్రి మురారిరావు ప్రవేశము.

మురా—అయ్యా శాస్త్రిలుంగారు పదివేల వందనములు. ఎక్కడనుంచిరో వచ్చుచున్నారే !

విభా—ఛీ ! భ్రష్టా నేను సన్యాసినా ! నాకేలవందములనియెదవు ! రెండువివాహములైగుంపెడుపిల్లలతో చల్లగానున్నవానిని పట్టుకొని యెంతమాట అంటివి.

మురా—నాకుతెలియదు యేమనవలెనో చెప్పండి !

విభా—మాబోటి పెద్దలను చూచినప్పుడెల్ల భక్తితో అయ్యా శాస్త్రిలవారు సాష్టాంగ నమస్కారములండీ అని మ్రొక్కవలె అంతట మేముదీవించెదము.

మురా—బుద్ధి బుద్ధి చెంపలువేసుకుంటాను లెండి (అని చంపలకు చేతులానించి) మీరు పెద్దలు చదువుకొన్నవారు పిల్లలుగలవారు మీరొవ్వచూస్తే నాకుచాలా జాలిగాను భీతిగాను ఉన్నది. నేను వైద్యుడను మందుయిత్తునా !

విభా—ఛీ ! ఛీ ! నాకేమివ్యాధిలేదు అవాచకములు పల్కెదవు కొంచెము భుక్తాయాసముగానున్నది.

మురా—మీకుయింత ఆయాసము కలిగేటంత పెట్టినవారెవరు ! నాకు మొన్నటినుంచి భుక్తిసున్నే.

(అపవాదము)

విభా—కుంతలనగరమున మంత్రియగు దుష్టబుద్ధిగారింట వారికుమార్తె పెండ్లియగుచున్నది నేడైదవరోజు నాకబలియగును నాకుయింటియొద్ద బాధ యెక్కుడైయె ప్రాణములన్ని అక్కడనేపెట్టుకొని యింటికిపోవుచున్నాను ఆపెండ్లివైభవము చెప్పనలవికాదు సదస్యమురోజున వరహాలే సంభావనలు యిచ్చిరి మారకములేదు యిక భోజనమిట్టిదని నేనుచెప్పజాల నాయాయాసమే సాక్షి.

మురా—స్వామీ ! ఆహరిశ్చంద్రుడు నూరు అబద్ధములాడినను మీరొకటైన నిజముచెప్పరుగదా ! మంత్రిగారింట లేనేలేరుకదా ! వివాహ మెట్లయ్యె.

విభా—ఓరిశుంఠా నాపెత్తనమునైన గణింపక తూలనాడుచున్నావేమి !

(ద్రవము)

విభా—ఉన్నసంగతికి పెద్దయేమి చిన్నయేమి! అపభ్రంశమునకు సందెలు సొకటే! మనసంగతి తీసితే కంపు కంపు.

విభా—(తనలో) ఓహో వీడునావెంటపడ్డాడే (ప్రకాశముగా) నాయనా అట్లు కాదురా! ఏదో యుత్తరమువ్రాసి మంత్రిగారా పెండ్లికుమారునిచేతనే చందనావతిపురమునుంచి పంపిరట. ఆచిన్నవాడు రాగానే సంగతులన్ని గ్రహించి తండ్రిలేకున్నను తగినకొడుకుగనుక నిమువమూలో ప్రతిష్ఠగా పెండ్లి చేస్తున్నాడు.

మురా—నేను మీతోవచ్చెదను వారింటికి తిరిగిపోయెదము. మీతోపాటు నాకును సంభావన నిప్పించెదరా!

విభా—(తనలో) దగ్గర చేరనిచ్చినందుకు నెత్తి కెక్కుచున్నాడే వీడిక్కిని నాతోపాటు సంభావన కావలసివచ్చినదా! ఓరే నీకేటికిరా సంభావనలు అందులోమాతోపాటు కావలయునా! ఆత్మస్తుతిపరనిందయులేనిచదువుకొన్న పెద్దశాస్త్రులుగారిని నాకుసంభావనా మీసాలుపెట్టుకొని చుట్టపీకలు కాల్చుచు సంధ్యముక్కలైన రాని పరమశుంఠా గ్రసరచక్రవర్తికినీకుసంభావనా!

మురా—సరేరా! నీఅంతు కనుక్కొనెదను వారియింట యింత కాలము చెడదిని మంత్రిగారినిన్ని వారికుమారుడు గారినిన్నీ తిట్టినతిట్లన్నియూ నేను వ్రాసుకొన్నానులే యిదేచూడు నీపనిపట్టుతాను (అని పరుగెత్తుచుండ)

విభా—అరే అరే నాయనా! నన్నురక్షించుతండ్రీ నీపుణ్యాన యింతవరకు పిల్లలు నేను యేదోకాలక్షేపము చేసుకుంటున్నాము నేను యెరుగకపోయి నిన్ను అన్నాను నాకొంపతీయకు. నాకంటేనీకు యెక్కువగా సంభావనయిప్పించెదను. నాయనా నీకుకోపమురాకుంటే యొక్కటిచెప్పుతాను ఆమీసాలు ఉంటేనన్ను చీవాట్లుపెట్టుతారు గనుక అవి తగ్గించుతే బాగావుంటుంది వద్దువద్దు పోనీ ఉన్నసుసరేలే నాతిప్పలు నేనుపడి నాకుయిచ్చినదైన నీకు యిస్తానురానాయనా!

(అని యిరువురు నిష్క్రమింతురు.)

## అష్టమరంగము.

(దుష్టబుద్ధి తనపురమునకువచ్చుట)

దుష్ట—(తనలో) ఇదియేమి? మనపురమెల్లను మిగులచోద్యముగాఁగనుపట్టుచున్నది? పురద్వారమున నేదో పచ్చతోరణములు మెరయుచున్నవి యిదిగాక మంగళవాద్యములును మ్రోయుచున్నవి. కారణమేమి? (యోచించి) నాసుతుడు చంద్రహాసునకు విషమునిచ్చి వాడుచచ్చినపిదప పురమలంకరించి యుత్సవము సేయుచుండెనాయేమి! నేనట్లుసేయమని వ్రాసియుండలేదే అయినను వీనిపైననాకు గలిగిన యీర్ష్యను గ్రహించి కాఁబోలు నిట్లుత్సవము చేయుచున్నాఁడు. చంద్రహాసుఁడు మృతినొంది నేటికి నాలుగు దినములై యుండునుగాఁబోలు (యింటిముందుకువచ్చి)

ఓహో! నేననుకొనుచున్నట్లులేదే! పెండ్లివైఖరు లగుపడుచున్నవే!

శా॥ ఏమేమో విపరీత కార్యములఁ జే ♦ యించెన్ మదీయాత్మజుం
డేమాయన్ బచరించుమన్న పస్రీవాఁ ♦ డేమేమి గాఁజేసెనో
తామోసంబునఁ జంద్రహాసుని మృతిన్ ♦ దప్పించెనోయేమొనా
మాంగల్య విశేషకంబులిటు నుం ♦ టన్ జూడఁ జోద్యంబగున్॥

ఎట్టి రాచకార్యములందును, ఆగతానాగతములను నిమిషములో గ్రహించెడి నాకీ యల్పవిషయమున సందేహము తగులుచుండెనే యేమి! ఇంతయేల వాకిటిలోనికే వచ్చితిని అన్నియు ప్రత్యక్షమగును గదా! (వాకిటిలోనికివచ్చి)

ఓరీ దండధరా! యేమి విశేషములు!

దండ— మహాప్రభూ! మహారాజా తమకుఁ దెలియని విశేషము లేమియున్నవి మీయాజ్ఞానుసారముగాఁ గుమారుఁడుగారు చేయుచున్న అమ్మాయిగారి పెండ్లికిది అయిదవరోజు.

దుష్ట—(పశ్చాత్తాపముతో) ఆ ఏమి! (యోజించును.)

దండ—అయ్యా తమరంత వ్యవధానములేకుండ వ్రాసినను వారును మీవంటి బుద్ధిమంతులేకనుక మీయభిప్రాయము చక్కఁగా గ్రహించి నిమిషములో దబ్బునకు వెనుకముందాడక సర్వంబును సిద్ధపఱచి పెండ్లి చేయించుచున్నారు తమయనుగ్రహముచేత నెన్నడుఁను దినని భోజనాలును, ఎన్నడుకట్టనిబట్టలుమా కందఱికి అమరినవి చూడండి. ఒక్కఁడైన అటువంటివాడే యుండవలెను.

దుష్ట—(నిట్టూర్పులు విడుచుచు) ఓహో! యిదియా సమాచారము. నేనునమ్మలేకున్నాను. అయినను అంతఃపురమునకుఁ బోయిన నన్నియుఁ దెలియును. (నిష్క్రమించును.)

## నవమరంగము.

(చంద్రహాసుఁడు కేళికాగృహసమీపము.)

చంద్ర—ఇక్కడ మిక్కిలి చొక్కంబులగు చెక్కడపు మేడలు పెక్కులుగలవట నేనుక్రమ్ముక తిలకించి వచ్చెద. (ప్రవేశించి) నలుదెసలుచూచి ఆహా యేమి యీశృంగారవిశేషములు కనులపండువుగావించుచు నితాంత సౌభాగ్య లతావితానంబుల కాలవాలంబై పెంపగుసొంపు సంపాదించుచున్నది.

మ॥ ఇది కేళీసదనంబ! కాదు ధనదున్ ◆ హింసించి దేవారి స
మ్మదమొప్పన్ గయికొన్న పుష్పకమొ సు ◆ మ్మా యట్లు కాకున్ననీ
పదియార్వన్నె పసిండియున్ విలువఁ జె ◆ ప్పన్ రాని రత్నావళుల్
కొదువెంతేనియు లేక యిట్లలరునే ◆ కోటానకోట్లై భువిన్॥

ఇది కేవలము మానవనిర్మితముగాక దేవతాసృజనముగానున్నది లేకున్న నిట్టిమూల్య దివ్యరత్నమయంబై యుండునే!

సీ॥ ఇదికదా మదవార ◆ ణేంద్రవంశపయోధిసంప్రాప్తమౌక్తిక ◆ సంచయంబు
ఇదికదా దుర్వాహ ◆ ర్వీశకోటీరాళి రాజితనవరత్న ◆ రాజరాజి
ఇదికదా లోకత్ర ◆ యీవిస్మయప్రదకుడ్య చిత్రితలతా ◆ కుసుమరాశి
ఇదికదా పంకేజ ◆ హితశశాంకకళాభి రమణీయదీపికా ◆ సముదయంబు॥

తే॥ గీ॥ ఇదికదా కల్మిచెలువకు ◆ సదనసీమ
యిట్టివైఖరులెందైనఁ ◆ బుట్టియున్నె
భళిరమంత్రికె యింతటి ◆ పదవిగల్గ
మనుజవిభు భాగ్య మింకనే ◆ మనఁగవచ్చు.

ఇంతియె కాక నలువంకల నమోఘములగు చిత్రపటంబులు గనుపట్టుచున్నవి (చూచుచు) ఇవి చిత్రపుత్రికావళులు కావు. ఛాయాయంత్రంబులం బట్టి వారివారి స్వస్వరూపంబు లెత్తిన ప్రతిమలుగాఁబోలు (యొకటిచేతఁ దీసికొని) ఇతఁడు మదీయ ప్రియభావుకుండగు మదనుఁడా! కాదా ప్రత్యక్షముగానున్నది.

క॥ కరమా జలజముచామీ
కరమా మయిచాయ మోద ♦ కరమాకృతి శ్రీ
కరమా నేత్రాంచలము సు
కరమా యీ లేమగుణ ని ♦ కర మారయఁగన్.

సీ॥ పరిపూర్ణకళలచే ♦ భాసురంబయినట్టి యీ మోముసొబగున ♦ కెద్దిసాటి
నూత్నయౌవనము క♦న్నులపండువుగఁ జూపు నీపూపచందోయి ♦ కెద్దిసాటి
రత్నసంపుసొమ్ముల ♦ రామణీయకమైన యీ ముద్దుకేల్గవ ♦ కెద్దిసాటి
కెంజిగుళ్లనెసంగు ♦ కెంపుచాలఁ బొసంగు నీ కోమలాంఘ్రిల ♦ కెద్దిసాటి

తే॥ గీ॥ వేయుమాటలేల ♦ వెలఁదియంగకముల
సాటియైనవస్తు ♦ చయముగలదె
హానికవియె సాటి ♦ వసుధలో నీ మోహ
నాంగిసాటి విమల ♦ యారకంబె.

ఆకోమలాంగిని గూడి సరససల్లాపంబులాడు భాగ్యమింకను ప్రాప్తింపకున్నను నీ శిల్పకారుఁడు నామనోవాంఛ నీమూలమున నీడేర్చుకొనఁజేసె ఏమీ వీని పుణ్యము! ఎంతచిత్రము ఈప్రతిమయే రెండవవిమలయై నాతో ముచ్చటింపనిలిచెనా! యని యనిపించుచున్నది. అయినను పల్కరింతునా!

చ॥ తరుణిశిరోలంకరణంబునకుఁ ♦ దళ్కొదవన్ మణిజేర్చినట్లుగా
నురమతియైన నీజనకుఁ ♦ డుత్తరమొందు లిఖించిపంచి వ్యస
త్కారమున నన్ను నీవిభుని ♦ గా నొనగూరిచె నాటగోలెని
న్నరిశిగఁ బల్కరింప మన ♦ సయ్యె నొకించుక ముచ్చటింపవే.

విమ—వెనుకనిలుచుండి చిఱునవ్వుతో
(తనలో) ఆహా నేటికిఁగదా నామనోభీష్టంబు ఫలించె.
చంద్రి—(తనలో) ఓహో! ఈతరుణీమణి యెప్పుడువచ్చె! (ప్రకాశముగ) మనోహారీ నీవిట్లేలవచ్చితివి!
విమ—నాథా! తమరీ చిత్రగృహంబుల విహరించుచు చిత్రపటంబుల వర్ణింపుచుండఁ దిలకింపవచ్చితిని.
చంద్రి—మంచిది యిందుఁగూర్చుండుము (విమల కూర్చుండుట)

## రాగమాలిక.

తరుణి—

సీ॥ నీతోడి సాటియెవా ♦ నెలఁత గాఁగనిదీనిఁ బల్కరించుచునుంటిఁ ♦ బల్లవోష్ఠి
ఆనంద మగ్నుండ ♦ నైదీని పొగడ నెల్ల వర్ణించుచుంటినో ♦ వన్నెలాడి
అధికమౌ విస్మయం ♦ బారువన్నెలనెల్ల వీక్షింపుచుంటినో ♦ విహగయాన
కాంభోజు సంతతి ♦ కుంభినీశునకైన నీసంపదల్ గల్గు ♦ నేలతాంగి॥

తే॥ గీ॥ శ్రీకనిలయంబులైనయీ ♦ చిత్రములను
భూరిగాత్రిరా కోరికల్ ♦ దీరఁగనుచు
సురటి వీచులగతిని దే ♦ బఱవనంచు
నామెతలఁదేలుచుంటినో ♦ కోమలాంగి.

ఏమినాభాగ్యము!

సీ॥ నీమూలముననఁగాదె ♦ నిర్మలహృదయుఁడౌ మంత్రిసత్తము నిజా ♦ మాత్రనొట
నీమూలముననఁగాదె ♦ నిస్తులమాణిక్య భూరిసౌధాళి విహారినొట
నీమూలముననఁగాదె ♦ భూమండలవ్యాప్త రామణీయ యశోవి ♦ రాజినొట
నీమూలముననఁగాదె ♦ నిరుపమానానేక రాజభోగముల వి ♦ భ్రాజితనగుట

తే॥ గీ॥ కలికినాయెడమీరెల్లఁ ♦ గల్గినట్టి
కరుణనేకాదె యీశుభో ♦ త్కరములహా
అవలమీపుణ్యమహిమనే ♦ మనఁగవచ్చు
వైభవనిధాన శ్రీవిష ♦ యాభిధాన.

విష—మనోనాయకా! మీరిట్లేలఁదలంచెదరు మీపైఁగరుణించు మేమెంత వారము?

తే॥ గీ॥ సింధుసంద్రంబులోని మా ♦ ణికము నృపుఁడు
చెట్టబట్టితెచ్చి యాదలఁ ♦ జేర్చుకొంట
రతనమునఁగల్గు సుగుణవ ♦ ర్గమునఁగాక
కరుణచే గౌరవించుట ♦ కలదె ఘనిని.

కావున నన్నింటికిని దావకీయ సౌందర్యసౌశీల్యాది గుణగణంబె ప్రధానము దేవర యనుగ్రహంబుననే మేమెల్లరమును కృతార్థులమైతిమి.

చంద్రి—ప్రేయసీ నీవిట్లుపల్క నేనేమనఁగలను?

(దుష్టబుద్ధి ప్రవేశము)

దుష్ట— శా॥ ఓరీమందమతీ వివేకమనువ ♦ లాక్రాక్రింతయో లేక మ
త్ప్రారోపాయములెల్లఁ బోనడచిదు ♦ శ్చారిత్రునిఁ నాకుమా
రీరత్నేశునిగాఁగఁజేసి యపకీ ♦ ర్తిఁదెచ్చి యస్మద్కుల
క్షీరాబ్ధిఁ విషముద్భవించినటులన్ ♦ జేశూరితేఁ..

ఛీ! పందా నేనేమివ్రాసితిని నీవేమి చేసితివి! నాయుపాయంబులన్నియు మంటఁక
ల్పి యొకచెనఁటిమాయకు లోనై నాముద్దుకూఁతు నొక దురాత్ముండును దుర
త్మండును నగు వానికిచ్చి పెండ్లిచేసితివి ఛీ! నీముఖము చూడ రా..
యోజనావిషయంబున బృహస్పతియంతటివాఁడ నని ప్రసిద్ధిఁజెందిన నా...
తుఁడవై బుట్టి యిట్టియల్పకార్యంబున మోసపోతివి భ్రష్టా!

(నిరోధనము)

మద—అయ్యా! క్షమింపుఁడు క్షమింపుఁడు నామనవి చిత్తగింపుఁడు

తే॥ గీ॥ అయ్య నాయెడదోసమా ♦ వంత యైన
లేదు తామంపినట్టి యీ ♦ లేఖనంబు
చదివెదనుదీనివృత్తాంత సార మెల్ల
విని పిదప నన్ను శిక్షింపుఁ ♦ డనఘచరిత.

కీర్తన. ఖరహరప్రియరాగము-ఆదితాళము.

తామస మేలా నను ♦ దయఁజూడుచాల॥ తా॥
తామంపిన లేఖఁజూచి ♦ తదుపరిశిక్షింపవె నొప్ప॥ తా॥
ఈచంద్రహాసుఁడువచ్చు ♦ నితఁడెట్టివాఁడో యనుచు
యోజన సేయకవిషయ ♦ నొసఁగుమంచు వ్రాసితంత
సూచన వేవేగఁదెలిపి ♦ సుతను వీనికొసఁగి పెండ్లి
యీచందమున నేఁజేసితి ♦ యింతెగాని దోసమెం... తా॥

దుష్ట—ఏమివ్రాసితిని! చదువుము (మదనుఁడుచదువును) అట్లు వ్రా...
మ్ముచూచెదను (అని తీసుకొనిచూచును)

(ఆశ్చర్యముతో)

ఉ॥ అద్దిర యెట్టిచిత్రమిది ♦ యాకుటిలుండు దుమ్మంగవ్రాయఁగా
బుద్ధిఁదలంచి వానికిటు ♦ మద్దియ నిమ్మని వ్రాసినాఁడ నా
బుద్ధిబలంబు లూహ లెటు ♦ బోయెను యాత్మని పాలిమ్ముచ్యతే
గద్దరివీనిఁజంపఁ గొఱ ♦ గాదనియిట్లొనరించెనే యొకో

ఆహా! నేనెంతటి ప్రమాదము చెందితిని! ఏదీ పాఠపాఠమ్ము వచ్చినదో చూతము
(అని చదివి) అకటా! రెండు చోట్ల పొరబడితినా! "నిజముగా నహి
తుండు సాధు" అను చోట నిజముగా నైయాని నకారమున కెత్వమిచ్చితిని "వి
షము నిమ్ము" అను ముఖ్యపదమునందే "విషయ నిమ్ము" అని మకారమునకు
బదులు యకారమును వ్రాసితిని ఇందువలన కార్యములన్నియు తల
క్రిందులయ్యె. పాపము నా సుతు నిష్కల్మషముగా దూషితిని నాయనా మదనా)
నీవలన నిసుమంతయు దోసము లేదు నీవు చేసినదంతయు శ్రేష్ఠతమమే నీవు!
సగరుననుసరించి కార్యములను గ్రహించుచుండుము) అని నడచుచుపోవును.

ఉ॥ ఓ దురంతపాతకము ♦ హాన్నక కల్మష చంద్రహాసనీ
పేరు పెకల్చి యుండఁ జోద్యముగు ♦ నేనెటు వన్నినఁ జావకుండెనా
కూరిమి పుత్రికన్ బతిఁగ ♦ గూర్చితి వెట్టిఁడ వారనిన్న నీ
పేరునఁ జూచి యోరుతున ♦ త్రిశ్వఁగఁజేసెదఁ గాక దుర్మతీ॥

ఉ॥ తాలు క్రియాకల్ గతించితిఁగ ♦ దాయని నెమ్మది సంతసించి నీ
పాలకతల్లి తండ్రులను ♦ బందెలఁ బెట్టి యాటేగు దేర నీ
గోలలు మేలు తైనసరి ♦ లెమ్మెటులైనను వంటయింటికుం
దేలు విధానఁ జిక్కితివి ♦ నీవెటుపోవఁగలావొ చూచెదన్॥

(వ్యవసాయము)

ఇంతను నీపంద్రిహాసుండు మొంచివాఁడు మొంచివాఁడని విడుతునా! యెట్లయినవీని
మృతినే కండ్ల చూడవలయును ఏమి పన్నుదము (అని యోచించి) బలే
మంచిదిలోఁచినది ఇదియీనియంత్యమున కే తోఁచెసుగాఁబోలు. తప్పక చావవ
లసినదే. దీనను చావఁడా నేనైనను దల మోచుకొని చావవలసినదే యిదియే నా
ప్రతిజ్ఞ నేనయిదవదినము కదా! మనయింట బెండ్లికుమారుఁ డయిదవనాఁ
డూరు బైటఁ గల కాళికా సాయంత్రనంబున నొంటరిగా పూజాద్రవ్యముల
ను, అఖండమును గైకొని పాదచారియైపోయి పూజించి వచ్చు నాచారము
గలదని చెప్పిపంపి అంతకుమున్న నమ్మికముగు నిద్దఱు సూసరులను గుడియం
దు దాగియుంచి యొంటరిగా నొకఁడు వచ్చును వానిని గుడిఁజొరఁగానే తత్
క్షణంబున అక్కి నా కావార్త తెలుపుఁడని చెప్పియేర్పాటుచేసెదను నేడే జరగ
వలయును వేళయగుచున్నది (అని నిష్క్రమించును)



శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

(కుశికి పూజాద్రవ్యములు మోసికొనిపోవును)

చంద్ర— కీర్తన

కాళికాంబ నన్నుఁగరుణ జూడవమ్మా॥ కా॥
చాలాభక్తి నీదు చరణాంబుజముల ♦ మదినమ్మినానఁట॥ కాళి॥
పరమేశురాణి భక్తత్రాణి ♦ పరమకల్యాణి శర్వాణి
అలినీలవేణి॥ కాళికాంబ॥

శా॥ అమ్మా నీదు తలంపుమాత్రనగదా ♦ యంభోజగర్భాది లో
కమ్ముల్ గల్గుటఁ బెంపునొందుటయుఁ బో ♦ కల్ గాంచుటల్ తావకీ
యమ్మౌ సత్కరుణంగదా సుజనుల ♦ త్యామోదముల్ జెందుటల్
రమ్మా నాకభయప్రదాన మిడ భా ♦ రమ్మా జగద్రక్షిణీ॥

క॥ కాళీకుంతల విజితవ
లాళీ రక్షోభయద శ ♦ రాళీ శ్రితధీ
పాళీ మునిహృత్సరసిజ
కాళీ ననుఁగరుణమీఱ ♦ రక్షింపఁగదే.

క॥ అంబారక్షిత భక్తక
దంబా కస్తూరికాక ♦ దంబాశ్రిత హే
రంబాలోచన జితరో
లంబాననుఁ బ్రోవఁగాఁదె ♦ లంబాజననీ.

మద—(కేకలువేయుచు) బావా చంద్రహాసా! బావా చంద్రహాసా! (అని తెలిసి
గుఱ్ఱముపైనెక్కి పరుగిడుచు కలియవచ్చును)

చంద్రి—ఏమీ యెవరో పిలుచుచు నన్నుకలియవచ్చుచున్నారు (అని నిలిచి తిరిగి
చూచును) మదనుఁడా ఏమి ?మదనుఁడిట్లేలవచ్చెను ?

మద—

చ॥ నిలువుము కాళికార్చనకు ♦ నేనిపుడేగెదఁ దెమ్ము వస్తువుల్
అలికులవేణిఁగూతు నచ ♦ లాధిపతిత్వము నీకొసంగఁగాం
తలునకనుగ్రహంబొదవెఁ ♦ దత్క్షణ మీ హయరాజమెక్కి భూ
తలపతిపాలికిం జనుము ♦ దారశుభంబిపుడావహిల్లెడున్॥

చద్రి—బావా ! నీవధికమగు నాతురతచేఁ జేరమెత్తుచు నన్నుఁగలియవచ్చుచు ప్రే
మాతిరేకమున నేమో చెప్పితివి ! ఏమి ! కుంతలమహీపతి సుతయేడ ! పెండ్లియే
డ ! రాజ్యాధిపత్యమేడ ! మీరుచెప్పినవి యసంభవవాక్యములుగా వినుపించి
నవి వానికర్థమేమి?

మద—అయ్యా ! మనకుంతల మహారాజేంద్రుం డపుత్రకుండనియును నేకపుత్రికా
వంతుడనియును వేద్యమైయుండును తనకిప్పుడత్యల్పకాలమున మృత్యువాస
న్నమగునని జ్యోతిష్కులుచెప్పనాతఁడు ప్రాయోపవిష్టుండు కానెంచి సు
గుణగణ విశారదుండగువానికి తనరాజ్యంబొసగి కుమారియగు చంపకమాలి
నిడి పెండ్లిగావింప నుద్యమించి తగువాని నరసి తత్క్షణంబ తెమ్మనుటయు
నందులకుఁదగినధీరుండవీవెయని ప్రభుసన్నిధిని నేనుమనవిచేసి నీవిపుడు కాళీ
కాపూజనమున కరుగుచుండుటఁ దెలిసికొని యొరులచే వర్తమానం
బంపఁ దడవగునని యెంచి యీహయంబుపైఁ బైనంబై నేనేవచ్చితిని. కా
వున నిరుత్తరంబుగా నావిన్నపమాలించి యీయుత్తమాశ్వముపై నెక్కి నగ
రునకుంజనుము నీకుమారుగా నేనే గుడికిఁజని దేవీపూజనమాచరించి వచ్చెద
ను శీఘ్రంబునఁ దెమ్ము రయంబునఁ బొమ్ము (అని పూజాద్రవ్యంబుల నెత్తిపైఁ
బెట్టుకొనును)

చంద్రి—ఆశ్చర్యముతో ! బావా మహాప్రసాదము ! నేనేమియుఁజెప్పఁజాల! నాకై
యెంతశ్రమ వహించితివి (అని గుఱ్ఱముపైనెక్కిపోవును)

మద—(గుడికిబయలుదేరి తనలో) ఏమినాభాగ్యము !

(ప్రరోచనము)

తే॥ గీ॥ నామఱఁదిచక్రవర్తియై ♦ నాయనుంగు
చెల్లియాలు పట్టమహిషియై ♦ చెలఁగుచుంట

వారికడ నేను మంత్రినై ♦ వరలుచుంటి
నాదుభాగ్యవిశేషంబ ♦ కాదె తలఁప.

నేను సత్వరంబుగఁబోయి కాళీపూజన మాచరించి మగుడ పట్టాభిషేకోత్సవంబునకు పరుగునఁబోవలయు ఇస్సీ! ఆదేవికేవిధానంబునఁ బూజసేయవలయునో యెఱుఁగనైతినిగదా కానిమ్ము శ్రీసూక్తంబు నభిషేచనము జేసి పిదప షోడశోపచారంబులఁ బూజించెద. కొరవడినచో చంద్రహాసుండును నేను వచ్చి యథావకాశముగాఁ బూజించెదము ఇఁక కాలవిద్యమానంబు లెట్లుండునో చూతము.

సీ॥ రాజునైతినటంచు ♦ రాజసమూని మన్నించునో నన్ను మ ♦ న్నింపఁ డేమొ
సిరివచ్చెనంచు మ ♦ చ్చికను బావా యని పిలుచునో నన్నట్లు ♦ పిలువఁ డేమొ
దొరనైతినని నాదు ♦ తోంటిసపర్యల మఱచునో యవియెల్ల ♦ మఱువఁ డేమొ
నాపయున్న ప్రేమలెదియో రాజ ♦ నలను స్వతంత్రత నిచ్చునో లేక నా ♦ కీయఁ డేమొ॥

తే॥ గీ॥ ఏదియెటులున్న నాతఁడ ♦ హీనగుణ
మందనుఁడు వానికడ నేను ♦ మంత్రినగుచు
నుండు టేచాలు వేనవే ♦ లూనఁగినట్లు
ఏమికాఁడ నాకు నిటుసంశ ♦ యింపనేల.

ఛీ! నాకేలఁబుట్టె దుస్సంశయము పుట్టె నామఱఁదియే చక్రవర్తియైయుండ నాకేమికావలయు! దేవియాలయమింకను సమీపింపకున్నది కాల మతిక్రమించును గాఁబోలు

కీర్తన. తోడిరాగము-రూపకము.

నేనెప్పుడేగెదనో నాపురికి॥ నేనె॥
మానవేంద్రుఁడా కులీందు ♦ సూనిని బట్టాభిషిక్తుఁ
బూనిసేయుతఱికి నేను ♦ బోఁగలనో లేనొయేమొ॥ నేనె॥
వేవేగ మగుడిక్కిఁ జేరి ♦ దేవీపూజ లెల్లఁ జేసి
భూవిభుని పాలికేగి ♦ కవిగా సుమంత్రిత్వమొంద॥ నేనెప్పుడేగెదనో॥

ఇదె దేవతాలయ శిఖరము గనుపించుచున్నది గుడియు సమీపించినది.

క॥ దేవీ మొక్కెద నేనిపు
డీవేదిక క్రాలుచునుంటి ♦ నీవే శుభం

ఆవిర్భవింపఁజేయుము
పావనకరుణాప్రసార ♦ పాపవిదారా.

గుడిలోనికి ప్రదక్షిణపూర్వకముగ పోవలయు (అని ప్రదక్షిణము సేయఁబోవును)

సూన—(మెల్లనతమలో) అరే వచ్చుచున్నాఁడురో భద్రము కత్తిగిత్తి సవరించుకో గుర్తిస్తాఁడేమో సుమా! (అని దాగి సిద్ధముగా నుందురు.)

మద—(ప్రదక్షిణముసేయుచు)

కీర్తన. తోడిరాగము—ఆదితాళము.

బ్రోవవే శర్వాణి ♦ దేవీశిరోమణీ
భావజరిపురాణీ ♦ పరమకళ్యాణీ॥ బ్రోవ॥
పావనగుణపాళీ ♦ కావఁగదే కాళీ
భావమునను నీదు ♦ పదములె నమ్మితి॥ బ్రోవవె॥

(గుడిలోనికి పోఁగానే సూనగులు నఱకుట)
(హరహరా అని పడిపోవుట)

విమర్శసంధి సమాప్తి.

## ద్వితీయరంగము.

(దుష్టబుద్ధి యేకాంతమున)

దుష్ట—(తనలో) ఏమీ! తలవరులింకను రారైరి! యిప్పటికాదు రాత్రులఁ జుట్టుకొక్కఁ జేరఁడా కార్యమంతయుఁదీరియుండదా! గుడికిఁబోకనే తప్పించుకొనిపోయెనా! తిరిగిమరణవార్త వినిపించియే పోయెదమనిరే యింతజాగేలచేసిరి నాతో జెప్పుట మఱచిరా! ఉదయమునఁ జెప్పఁగలమని యుపేక్షించిరా! నేనింత యాతురతతోనుండ వారిట్లుచేయనగునా! నేనే వారింద్రయిండ్లకుఁ బోయి వత్తునా! (అనుచుండ)

సూన—ప్రవేశించి (దేవా దండములు) పనినెరవేర్చుకొనివచ్చితిమి మాపనియైనది యిఁక దేవరవారి దయయే రావలసియున్నది తక్కినసంగతులన్నియు రేపు మనవిచేసెదము ఇదిగోండి కత్తి, రక్తము.

దుష్ట—శబాసు మంచిది సంతోషము మీరుపోయి యుదయముననే రండు.

సూన—చిత్తము (అని పోవుట)

దుష్ట—ఓరీ చండాలా! యెంత కాలమునకు మృతుఁడైతివిరా? ఎంత కాలమునకు నా మనోభీష్టమీడేరెరే. రేపు ప్రాతఃకాలమున నేగు [illegible] బోయి వాని శవమును కన్నులార జూచి వచ్చెద. ఇప్పటికర్ధరాత్రి యైనట్లున్నది (అనుకొనుచుండ)

దండ—మహాప్రభూ! తమ అల్లుఁడుగారగు చంద్రహాసమహారాజుగారు మన చక్రవర్తిగారికూఁతురును బెండ్లియాడి మన రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై [illegible] గుచు వచ్చి మీదర్శనార్ధమై భార్యాసహితముగా నిచ్చటికి వచ్చుచున్నవాఁడు.

దుష్ట—(కోపము ఆశ్చర్యము చూపి) ఓరీ భ్రష్టా తారుమారుగా వాగుచున్నావు! చంద్రహాసుఁడా! చంద్రహాసుఁడా!

దండ—ఔనండీ చంద్రహాసుఁడే సందేహమేటికి! (అని [illegible]) రానేవచ్చిరి.

దుష్ట—ఓహో! యిదేమి పిడుగువార్త!

చంద్ర—మామగారూ! నమస్కృతులు.

చంపకమాలిని—అయ్యా! జోహారులు.

దుష్ట—సుఖీభవ!

చంద్ర—అయ్యా! మీ యనుగ్రహంబునఁ గుంతలమహీపాలున కల్లుఁడనగుటయే కాక మూర్ధాభిషిక్తుండనై దేవదర్శనార్ధము యిందరు వెంట [illegible] యువచ్చెద.

దుష్ట—నా యనుగ్రహమేమి! పోయిరండు

(చంద్రహాసుఁడు చంపకమాలిని పోవుట)

దుష్ట—తనలో ఓరీ పాపాత్మా యెంతటికి రాతకుండవురా! నా బుద్ధిబలంబెల్లను నీపాలే చేయవలసివచ్చెనుగదా! తిరిగి యిప్పుడేమిపన్ని బ్రతికితివి! యీసారి మృతి తప్పించుకొనుటయే కాక నిరపరాధియగు వానినేవనినో వంచించి పి సరహత్యయు మూటకట్టుకొంటివి నిన్నేమనవచ్చును! అకటా పాపము! వాని యాలుబిడ్డ లెంత ఘోషించుచుందురో కదా! ఎవనిఁ జంపించి యుంటిను! ఎవరినైన నేమి యీదురాత్ముఁడు జేసినపనికి ప్రాతఃకాలముననే గుడి కిఁబోయి చూచివచ్చి పిదప వీనికై యేదో పన్నుగడయు [illegible] ను రాత్రిమించుచున్నది (అని నిష్క్రమించుచు)

తండ్రీ! నీకై యెన్నెన్నియో వ్రతోపవాసాదులు సల్పి యెన్నియో దేవతాప్రార్థనలు చేసి నిన్నొక కనకపుగట్టువలె గాంచి నీకొఱకెంతో మురియుచున్న మాకుఁగడకీ పాటు వాటిల్లఁజేసితివిగదా!

శా॥ అన్నా నిన్నని పెంచియెత్తియు నవీ ♦ తాన్వీతుఁ గావించి నా
న్నెన్నెన్నో విద్యలు నేరిపించి నిను భూ ♦ మీశోత్తముం జేసి యా
మన్నీలందఱు నీకు మ్రొక్కఁగను బ్రజే ♦ మం బ్రోవఁ జేయంచుఁ గా
నన్నీరీతిఁ గృశింపఁ జేసితి గదా ♦ నాభాగ్య మిట్లయ్యెరా।

సీ॥ ఈ రాజసుతను నీ ♦ కిచ్చి పెండ్లి గావించి చూచుభాగ్యము నాకు ♦ లేనైతి
నినుఁ బట్టభద్రుగా ♦ నొనరించి కనులారఁ జూచుభాగ్యము నాకు ♦ లేనైతి
సామంతులెల్ల హె ♦ చ్చరికల నిను మ్రొక్కఁ జూచుభాగ్యము నాకు ♦ లేనైతి
నీవు పుత్రయుతుండ ♦ వై వెలయఁగఁ గండ్లఁ జూచుభాగ్యము నాకు ♦ లేనైతి

తే॥ గీ॥ అక్కటా మందభాగ్యుండ ♦ నైన నాకు
బట్టివైన నన్ను నిక్కట్ల ♦ పాలుచేసి
మురిపెములు నేటితోడనే ♦ ముగిసిపోవ
నిట్లు కాళికకు బలియైతి ♦ వేసుమార.

నాయనా! నీకోమలశరీరంబును నెట్టిదుర్దశయందుండఁ జూడవలసివచ్చె నా ప్రేవులు తరుగుకొనిపోవుచున్నవిగదా! అయ్యో! దుఃఖము పొంగుచున్నది.

సీ॥ పూబాన్పులను లోప ♦ ములనెన్నువాఁడవీ రాలనెట్లు పరుంటి ♦ రాకుమార
గోటిగీఁత కెయ్యోర్వఁ ♦ గొరగానివాఁడవీ కోతలకెట్లోర్చి ♦ తో తనూజ
నగరులందె చరింపఁ ♦ బెగడొందువాఁడవీ వనికి నింతదవ్వెట్లు ♦ వచ్చితయ్య

తే॥ గీ॥ అయ్యయో యేమెఱుంగని ♦ యర్భకుఁడవు
నీవు క్రూరులపాలైతి ♦ వేమనందు
వసుధ నేరినిగని మెచ్చు ♦ వాఁడనింక
దిక్కు నాకెవ్వరయ్య నా ♦ చక్కనయ్య.

శా॥ ఏరా పిల్చినఁ బల్కవేల దయలే ♦ దేనీకు నామీఁద నీ
మారామా! జనకుండ వచ్చితిని స ♦ న్మానింపరా నాయనా
ధారం బెవ్వరొ చూపియైనఁ జనరా ♦ దౌర్భాగ్యుఁడన్నన్ను నీ
వీరీతిం విడనాడి పోఁ జనునే ♦ నేనెట్లు జీవింతురా॥

ముద్దుకుమారా! నీమోహనాకారము కనులారఁజూచుభాగ్యము నేఁటితోఁగదా తీరె
ను. తనయా! నినుఁజూడఁజూడ నామనము దఱికొనుచున్నది.

సీ॥ అమృతంపుసోనలిం ♦ పలరారఁగాఁబల్కు సరసములపదనమా ♦ యిదికుమార
రత్నకంకణముల ♦ గవలి చేవిలసిల్లు ముంజేతులా యివి ♦ ముద్దువట్టి
క్రొంబట్టుపట్టముల్ ♦ గుఱుగు గాధరియించు మృగులశరీరమా ♦ యిదిసుపుత్ర
నిందుప్రాయముకను ♦ పండువుగాఁజూపు నూగుమీసలయివి ♦ రంగనేత్ర॥

తే॥ గీ॥ కాలఁబడి పొరలాడుచు ♦ జాలిదూలి
నీనునాగరికతయెల్ల ♦ నేలఁగలియ
నెత్తుటను మున్గియున్ననీ ♦ యుత్తమాంగ
మేనెటులఁజూచియోర్తు నో ♦ యాత్మజాత.

అకటా! సుకుమారా! మదనా! చంద్రవదనా! నాచిన్నారిపట్టీ! నన్నుఁ దప్పు
దప్పులనే కాంచి మన్ననలఁజూపుచు నెనర్కొనువే నేఁడేల నన్నిట్లు మొఱ
పెట్టి నామొఱాలింపవు బాలకా వేదసుదోరకైన పెన్నిధివలె నీవుకలుగ నట
చేతిలోని నిధికాని ప్రాణపదంబుగాఁ బెంచిపెంచి నేఁడీదురాత్ముండగు చం
ద్రహాసున కర్పింపవలసెఁగదా! నీముద్దుమాటలు మాటిమాటికిని నోటఁబల్కి
నట్లు చెవులకు తట్టుచున్నవి పుత్రా! నీరాచకార్యములును నీధర్మప్రచారము
లును నీవిద్యలును ఏమిచేసిచనుదెంచితివి తండ్రి అయ్యో! నీమోహనమ్ము
దుల శరీరంబున కెట్టిపాటు ప్రాపించె!

సీ॥ ఆకిరాతకులుని ♦ న్నరికట్టువేళనీ యుల్లమందెంతభీ ♦ తిల్లినావొ
కఱకుకత్తులనునీ ♦ కంఠంబుఁదఱుగుచో నెంతెంతపరితపి ♦ యించినావొ
త్రాణయెల్లనుబాసి ♦ ప్రాణముల్ బోవుచో నేమునిననెంచి ♦ యేడ్చినావొ
ఆకస్మికపుమృతి ♦ యారుదేరమ్మెల్లఁ బాయఁజాలకయెంత ♦ వనపినావొ॥

తే॥ గీ॥ బాలకానన్ను నిక్కట్ల ♦ పాలుజేసి
యెల్లసిల్లెదు నీసిరు ♦ లెల్లఁబాసి
యిచటఁబెనునిద్ర పోవుచుం ♦ టేమనందు
మారసుకుమార ముద్దుకు ♦ మారధీర.

నాబుద్ధిబలంబును నాయుదారసాహసంబును నాయశోవిశేషంబును నాప్రజ్ఞాతిశయం
బును నీకొఱకుఁగాక మఱియెవరినుద్ధరించుటకు పుత్రా! ఛీ! నేనెంతనిర్భా

ష్యుండను ఇంతబ్రతుకు బ్రతికి తుదకు ప్రతిజ్ఞాభంగము నొందవలసె ప్రతి
జ్ఞాభంగనముకన్న ప్రాణభంగమే మేలుకదా! నాజన్మమేలగాల్పనే నాకొక
కొండవలె నండగానుండఁజూచుకొన్న నీవుండని యీయఖండ మహీమండ
ల సామ్రాజ్యమేల! నామంత్రిపదంబేల! నేనింక నెవరికొఱకు నుపాయముల
బన్నెదను! నేను బ్రతికియుండి యేమిసేయవలయు అనురాత్మునికడ మంత్రిత్వము
వహింపవలయుఁగాఁబోలు! నాచేతనైనంతదాఁకఁ జూచితిని. కానిమ్ము యీ
రాజ్యమ్మును నిజ్యమ్మును జాసినే రామరాజ్యమగు నేఁటిమ్ము ఇట్టి కట్టిదం
బాలంబకే జీవించినను వాఁడియంతయు గ్రహించిన నన్ను బలాత్కారము
గనైనఁ జంపఁజూచును చంకునని దాపిన నిసివలె పుత్రహీనుండనై జీవిం
చుటకన్న మిన్నయగు వీనితెన్నదొరికిన మృతుండనైతినేని నాయర్ధాంగి
యము సహగమనక్రియతో నన్నుఁ గలియును. మేము మగ్గరమును దగ్గరజేరి
యుందుము. ఛీ! యీప్రతిజ్ఞాభంగము నొంది యేలజీవింపవలయు? ఛీ కా
ళీ! నీముఖముఁ జూడరాదు. నీవుండియే యిట్టిఘోరకృత్యముఁ జేయుచుం
డఁగనుచుంటివిగదా! యిట్టికిరాతురాలవగు నిన్నుఁజూచి యోర్వఁజాల
నేమను నీశిలా స్తంభమునకుఁ దలమోదుకొని చచ్చెద (అని తలకొట్టు
కొని చచ్చుట)

## చతుర్థరంగము.

(చంద్రహాసుడు గుడికి కత్తిచేఁబూని వెడలి)

చంద్ర—

మ॥ అకటా యెంతటివార్త వింటి విమల ♦ స్వాంతుండు నామామయా
త్మకలంకాత్ముఁడు నామటుండియును శ ♦ క్త్యాగారమందొంటిగా
వికలాంగంబులఁ ద్రెళ్ళియుండిరఁట యీ ♦ వృత్తాంతమున్ విన్నఁ గ
ర్ణకఠోరంబుగనుండె నేనటకుఁ జే ♦ రంబోయి వీక్షించెదన్॥

కటకటా! యీపిడుగువార్త విన్నప్పటినుండియు నాయుల్లము తల్లడిల్లుచున్నది
త్వరితంబుగాఁ బోవలయు (అని పోవుట)

(గుడికిబోయి) ఆశ్చర్యముతో! అన్నా యెంతటి ఘోరకృత్యము. ఇంతటియపకృ
తి యెట్లు జరిగియుండును?

తే॥ గీ॥ అయ్యయో భాసమించక ♦ ఱేను లేని
పుణ్యులగు మీమి సిస్లేల ♦ మూడెన వ్యా
సుంత పనిఁ జేసినట్టి వా ♦ రెవ్వరొక్క
తెలిసిన వధించి వత్తునా ♦ కలత దీర.

కీర్తన. కేదారరాగము—రూపకము.

ఇదియెంత కఠినము ♦ ఏమితో నదామొ నేను॥ యిది॥
సదనములు నిర్మలహృదయములు ♦ సకలజ్ఞులు నిగవరాధు.
లగు రీతులిటు దుర్మార్గతను ♦ లంది యుంట యేమి కత నేమొ॥ యిది॥
చలిచీమలనైనను భువిఁ ♦ జంపఁ ద్రొక్కఁగ నేరని యా
లలితాత్ములఁ జంపఁగ నే ♦ తులువల కెట్లు మది గల్గెనో॥ యిది॥

అక్కటా నేనేమి సేతును! ఈ మహాత్ములచే నేనెంతటి మహోపకారముల నొందితిని! నా కట్టి పదవి గల్గుటకు మూలము మీరు గాక మఱి యెవరు! (మంత్రి కడకు వచ్చి) సకలంబును దెలిసిన యో మహామహుండు సుఖంబున గూర్చుండి మమ్ముఁ గాంచి సంతసింపుచుండ మదనుని మంత్రిగా నిడికొని చల్లగాను ప్రజలను రాజ్యములు భాగ్యమునకు నోచనైతిని నా మనోభీష్టంబు లన్నియు నష్టంబు లయ్యెఁ గదా! యింతటి దుఃఖమునకు నే నెట్లు సైరింతును!

అయ్యా! మంత్రివర్యా!

సీ॥ కన్నులం బెడుమిషఁ ♦ గని కూఁతునికి పెండ్లి సేయించినట్టి యా ♦ క్షీణకరుణ
పెండ్లియైదవనాఁడె ♦ ప్రేమ చేమముఁ గాంచి యాశీర్వదించిన ♦ యట్టి ప్రేమ
శాలి ప్రజనమని ♦ కల్పించిన సుబట్టి భగ్నుఁ జేసిన సత్క్రియ ♦ పారసంబు
పట్టి భగ్నుండనై ♦ భక్తి చేమి ముఖ్యమెక్కనుఁ గాంచి మన్నించి ♦ నట్టి మహాత్మ॥
తే॥ గీ॥ అంతయును నేటితో దగ ♦ నాడి నన్ను
దీనుఁ జేసి నకయె యొంటరి ♦ వానిఁ జేసి
యరుగు దెంచితి రింకనా ♦ యండ యెవరు!
మతి విశేష సుధాచార్య మంత్రివర్య॥

ఇంక నా మువ్వంపు తనుంగు మఱఁదిని గాంచి యెట్లు భరింతు! అని మదనుని కడకు వచ్చి మదనా! సద్గుణసదనా!

ను ఏలచేసికొనవలయు! ఇట్లు చింతిల్లుట ధీరోదాత్త లక్షణము కాదు. ఎంతయును ధైర్యము నవలంబింపవలయును. వీరిని బ్రతికించు నుపాయము నరసెదను. నేనీ కాళికను పాసించి ప్రత్యక్షము చేసికొని తదనుగ్రహంబున బునర్జీవితులం జేయవలయు. (అని కాళిని చూచి మ్రొక్కి) హా దేవీ! దివ్యప్రభావా నేనే నీతిమంతుఁడనైతి నేని నే సుక్షత్రియకులజుండనైతి నేని కరుణించి నాయుద్యమము నెరవేర్పుము ఇదే చని పంచాగ్నుల మధ్యంబునఁ దపంబాచరించెద.
(అని పోవుట)

(తిరిగి శవములకడకు వచ్చి)

క॥ ఇది కాళికా ప్రసాదము
ముదమారఁగ వీరివక్త్ర ◆ ములనిడ నిద్రన్
వదలిన కరణిని దొలికళ
లొదవఁగ లేతురని శక్తి ◆ యొసఁగ నుదినిన్.

ఈ దేవీప్రసాదమున వీరు బ్రతుకుదురు గాక (అని ప్రసాదము వక్త్రములందునుంచ
నిరువురును లేచుట)

దుష్ట—ఆహా యెంతటి నిద్రపోయి మేల్కొంటిని (అని చంద్రహాసుని కై చూచి) ఈ మహానీయునా! నాదురాలోచనలెల్లను ప్రయోగించి చంపఁజూచితిని. ఛీ నేనెంతటి పాపిని! ఇప్పుడీ పుణ్యుని చేతనే కదా మేమిరువురును బ్రతికితిమి. మాకిచ్చుటనితఁడు గాక మఱెవ్వరు! అట్టి యీపుణ్యునికి నేఁ జేసిన యపకృతికి నాకుఁ దగిన శిక్ష యెప్రాప్తించె. నాజన్మము కాల్పనా! వీని ముఖము చూడఁజాల. అని తలవంచుకొని యొకచో నిలుచుండుట.

మద—బావా చంద్రహాసా! రాజపుత్రిని బరిణయంబై మూర్ధాభిషిక్తులైతిరా!

చంద్రి—నాయనా యేమని చెప్పుదును!

చంద్రి—మామగారూ నమస్కరించెదను.

దుష్ట— ఆ॥ వె॥ మామగాఁ డితండు ◆ మర్యాదహీనుండు
దుర్మదాంధుఁడార్య ◆ దూషకుండు
కుటిలవర్తనుండు ◆ క్రూరుండు మూఢుండు
దుష్టబుద్ధివీఁడు ◆ దుండగీఁడు.

శ్రీ శృంగార చం॥

అనంతకోటి పాపములకాస్పదుండనగు నన్ను "మాన
దయఁ జెదునేమొకదా ! నేనొక మహాపరాధిని క్షమింపుము.

చం(ద్రి—అయ్యా ! యీల్లీల బెట్టిదము లాడ గొనియెదరు !

గ(ప్ప—నాయనా నీవు సుగుణగరిష్ఠుండవు, దైవబల సమన్వితుండవు, నగుటంజేసి నీకు హిమచే మస్సుఁ బునర్జీవితులఁ జేసితివి. నేనీకొనరించిన యపకృతికి నాకీయపకారమనర్హము నాకీ నుర్మరణమే సరియైన శిక్షణము ఎట్లనిన.

సీ॥ నిను బాల్యమునఁ బట్టి ♦ వనములో నరకింపనెంచి కూరులకుఁ బ ♦ ట్టించినాఁడ
నీకు విషంబిచ్చి ♦ నీల్గింపఁ గావించి నిను నాకొడుకు చెంత ♦ కనిచినాఁడ
కాళీ ప్రజనమని ♦ కల్పించి నినుఁ బంచి యీ యామె దసుతుని గో ♦ ల్పోయినాఁడ
సంతసైనగ్రహింప ♦ కన్యాయమునగ నిన్ను బిట్టుగా నెన్నియో ♦ తిట్టినాఁడ

తే॥ గీ॥ అయ్యా ! నినుఁ జంపనేఁ జేసి ♦ నట్టి పనులు
తప్పిపోయెను ఎన్నియో ♦ చెప్పఁ జాల
నింతటికి నాత్ముఁడను గాన ♦ నిటులఁ జచ్చి
నేడు నీకృపజీవించి ♦ నిలిచినాఁడ.

ఇంతయే కాక తొలుదొల్త మదనునకుత్తరంబు నీచేఁ బనిచి సధర్మలకు నీతలిదండ్రులను బలాత్కారమునఁ జెఱఁ బెట్టించి వారియిష్టసంపదలెల్లఁ జూరగొని వచ్చినాఁడ. ఇట్టి పాపాత్ముఁడను కావున నే యాట్లనుభవించితిని తలయెత్తి నిన్నువీక్షింపఁ జాలకున్నాఁడ. ఇంతకును కారణంబేమన ! నేనొకనాడు నా యింట జ్యోతిష్కులతో ముచ్చటించుచుండ నీవటకు బంతికై వచ్చితివి. వారు నిన్నుఁ గాంచి సాముద్రికలక్షణంబులం బట్టి నీవీదేశంబునకుఁ జక్రవర్తి వగుదువని చెప్పిరి. నేనంతకుమున్నె నాకొమరునకు రాజకుమార్తెను బెండ్లిచేసి రాజ్యాధిపత్యమియ్య నుద్యమించితిని. అట్టియుద్యమమునకు భంగంబగునని నిన్నుఁ జంపింప నాచేతనగునంతటివఱకును యత్నించితిని. తుదకిట్టులయ్యె. నావర్తనంబులన్నియు నిట్లుండెఁ గాన

వృత్తమాలిక.

గప్ప చం(ద్రి హాసునితో } అయ్యా నీకపరాధీనగు మరి ♦ తాత్ముఁడను ననుఁ గావుమా।
యియ్యెడను నా నేరముల శమి ♦ యించి నన్నుక్షమింపుమా।

చంద్ర దుష్టతో } అయ్యయో పసిబాలునన్నిటు ♦ లాడ నేటికి ధీమత్తీ।
నెయ్యమున దీవనలతోఁ గరు ♦ ణింపవే సచివాగ్రణీ।

(ప్రసాదము)

(సాష్టాంగ) ఆహా! యేమి నాభాగ్యము. నేటికిఁగదా నాదు మనోభీష్టంబులు పండెను. మహామహుండును నాయనుంగు తల్లిండును నగు చంద్రహాస రాజేంద్రుని పట్టాభిషేకోత్సవము కనులారఁగాంచితిని. చాలు.

(సమయము)

తే॥ గీ॥ లోకమఖిలకళావరి ♦ పాకమయ్యె
కువలయానందరసమైన ♦ గూర్చియుండె
సత్ప్రచారంబులెల్లెడ ♦ జరుగుచుండె
చంద్రహాసుండు రారాజ ♦ చంద్రుఁడౌట.

(ఆనందము)

చంద్రహాస మహీపాలా! నీవు కరుణించి నామనవి నంగీకరించుటచే నాదు మనోభీష్టంబులు ఫలించిన తావక పట్టాభిషేకోత్సవమును గనులారఁగాంచి ధన్యుండనైతి. నీవఖిలజ్ఞుండవగుటను నీయెడ నాకుఁగల విశ్వాసముచే నాకనుభవసిద్ధమగు నొక్కవాక్యము వక్కాణించుటకు నెలవొసంగుము.

చంద్ర—దేవరకృపకుఁ బాత్రుండనుగదా!

ముష్ట—

సీ॥ పరులవైభవములఁ ♦ బండువెన్నెలలట్లు చల్లఁగఁగనియుల్ల ♦ సిల్లవలయు
పరులయదృష్టసం♦పదలసంద్రముమాడ్కిఁగనులారఁగని మెచ్చు♦కొనఁగవలయు
పరులసత్కీర్తిని ♦ హరిపురాణములీలఁ గొల్లగ వినియార ♦ డిల్లవలయు
పరులయా వనరూప ♦ భాగ్యంబు మేరువుచందానఁగని మోద♦మందవలయు.

తే॥ గీ॥ పరులసౌఖ్యోన్నతులనింటి ♦ పండువులుగ
పరులకష్టంబులను దన ♦ బాధలట్లు
నరయుచుండంగఁదగుసుమీ ♦ నరవరుండు
నమ్ముమివియనుభవవచ ♦ నమ్ములనఘ.

సీ॥ కొంగునముడివేసి ♦ కొనిదాచుకొన్నట్టి
యరుతరాగ్నియెసుమీ ♦ యోర్వలేమి।
కడిమిఁగైకొనికుత్తు ♦ కకుఁ జుట్టుకొన్నట్టి
యుగ్రసర్పమెసుమీ ♦ యోర్వలేమి।

# పంచమాంకము.

తే॥ గీ॥ వంశితవిధేయుఁడగు గురు ♦ బ్రహ్మశర్మ
క్షితినిశృంగార చంద్రికా ♦ సీయమనెడి
నాటకముఁగూర్చి హరికర్ప ♦ ణంబొనర్చె
మిగులనాచంద్రతారార్క ♦ మగుచువెలయ.

స్వస్తిరస్తు.

---

